## చందాదారులు



1 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ
2 తూములూరు కోటయ్యగారు, పినపాడు
3 ద్రోణా సోమయ్యగారు, సర్వవరము
4 రామకృష్ణా రెడ్డిగారు, దైవముదిన్నె
5 శంకరరెడ్డిగారు, పెదమరివీడు
6 ఇంద్రకంటి కృష్ణమూర్తిశాస్త్రిగారు, కర్నూలు
7 ఇంద్రకంటి నరసింహయ్యగారు, కర్నూలు
8 వనం సీతారామశాస్త్రిగారు, సంస్థానపండితుఁడు, కొల్లాపురము
9 మిర్యాపురము రామకృష్ణారావుగారు, కొల్లాపురము
10 బహుగానము కృష్ణయ్యగారు, దేవరమ్మనాగవరము
11 శ్రీరామకవచము అనంతశాస్త్రిగారు, మిడిల్‌స్కూలుపండిట్ మిరియాలగూడెము.
12 సిరిసెనగండ్ల నరసింహారావుగారు, కరణము, తుంగతుర్తి
13 ఏలేశ్వరము వెంకటకృష్ణశాస్త్రిగారు, ఎల్లాపురము
14 బొప్పా లక్ష్మణరావుగారు, కరణము, మునగల్లు
15 వద్దిరాజు సత్యనారాయణరావుదేశపాండ్యాగారు, మేడిపల్లె
16 వేలేటి రాఘవశాస్త్రిగారు, మిడిల్‌స్కూలుపండిట్, హైదరాబాదు
17 సరిపల్లె విశ్వనాథశాస్త్రి యమ్.యే.గారు, నైజాంకాలేజి, హైదరాబాదు
18 వెంకటరాజేశ్వరసిద్ధాంతిగారు, శంకరమ్మపేట
19 గజవాడ హనుమదాచార్యులుగారు, అల్లాదుర్గము
20 కొండంభట్లగారి వెంకన్నగారు, గుమ్మడిదల
21 నరసింహారావుగారు, కరణము, బొంతపల్లి
22 వకీలు శంకరరావుగారు, మాచాయపేట
23 కొండా సోమయ్యగారు, ముస్తాదరు, రాజంపేట
24 తిరుమలరావుగారు, కరణము, దేమె
25 ఉప్పల రంగారావుదేశపాండ్యాగారు, తాడూరు
26 ఇరుకుళ్ల వెంకయ్యగారు, సిరిసిల్ల
27 బిదరు కృష్ణయ్యగారు, అగ్రహారికులు, తూపరాణి
28 జేచిపతి సీతారామయ్యగారు, చుంచనకోట
29 సుద్దాల లక్ష్మారావుగారు, కరణము, బొందుగుల
30 నరసారెడ్డి మొకద్దముగారు, నాచారము
31 నెల్లుట్ల పాపయ్యదొరగారు, బమ్మెర
32 నారాయణరెడ్డిదేశముఖుగారు, చినమడూరు
33 చారబుడ్డి రత్నారెడ్డి మొకద్దముగారు, న్యాలపోగుల
34 కాచరాజు రామచంద్రరావుదేశపాండ్యాగారు, సింగరాజుపల్లె

35 మొసలి పాపిరెడ్డి మొకద్దముగారు, కొమ్మేపల్లి
36 రాజరాజనరేంద్రాంధ్రభాషానిలయము, హనుమకొండ
37 దేవరపల్లి రామకిషన్‌రావుగారు, కరణము, వంగపాడు
38 దేవరాజు జనార్దనరావుగారు, కరణము, అత్మకూరు
39 కురికాల మాధవరావుదేశముఖుగారు, పరకాల
40 రావుబహదరు దురిసేటి శేషగిరిరావుగారు, వకీలు, కాకినాడ
41 కంచిరాజు లక్ష్మీనరసింహముగారు, వకీలుగుమాస్తా, కడప
42 రాజా విక్రమదేవవర్మగారు, శ్రీజయపురసంస్థానప్రభువులు
43 వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు బియేగారు, హెడ్మాష్టరు,
కొల్లాపురసంస్థానము
44 చేబ్రోలు సరస్వతీదేవిగారు, గవర్నెస్, మీర్జాపురపుఎస్టేటు, నూజవీడు
45 ముదిగొండ వేంకటరామశాస్త్రిగారు, చవటపాపయపాలెమగ్రహారము
46 మంచికంటి వెంకటరామయ్యగారు, కంట్రాక్టరు, నర్సారావుపేట
47 పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు, గుంటూరు
48 భువనగిరి కోదండపాణిగారు, జాయంటురిజష్ట్రారు, గుంటూరు
49 దంటు లక్ష్మీనరసింహముగారు, సుద్దపల్లి
50 గడియారము శివయ్యశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి
51 వుల్చి రామయ్యగారు, పేరికెలపూడి
52 భాగవతుల సూర్యనారాయణగారు, కొల్లూరు
53 తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు, చందోలు
54 గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసు సర్కిలినస్పెక్టరు, తెనాలి
55 మంత్రివాది చినరామచంద్రశాస్త్రిగారు, పంచాయతిబోర్డు ప్రెసిడెంటు,
[దండమూడి
56 మల్లాది సోమసుందరముగారు, డిస్ట్రిక్టువకీలుదారు, పొన్నూరు
57 పిశుపాటి సీతారామయ్యగారు వ॥ ఇంకొల్లు
58 మంచెళ్ళ సీతారామయ్యగారు, పరుచూరు
59 మల్లేశ్వరసంస్కృతపాఠశాల, నూతలపాడు
60 ఆదిపూడి లక్ష్మీనారాయణగారు, కరణం, ఆదిపూడి
61 సెనగవరపు సీతారామాంజనేయులుగారు, నూతలపాడు
62 ఎట్టిం బక్కిరెడ్డివగైరాగారు, ఎట్టింవారిపాలెము
63 గొడుగుల నారాయణమూర్తిగారు, కొప్పర్తి.

# అభినవసరస్వతి

| సంపుటము | యువనామ సంవత్సరము | సంచిక |
|---|---|---|
| ౨౭ | మార్గశిర మాసము | ౯ |

## —♦ కృతివిమర్శము ♦—

కాంతాపహరణము:— సాంఘికనాటకము. వేగుచుక్కగ్రంథమాల కిది 28 వ పుష్పము. గంథకర్త పుల్లేటికుర్తి కృష్ణమాచార్యులుగారు. వేగుచుక్క గ్రంథమాల గంజాముజిల్లా బరంపురములో నెలకొల్పఁబడినది. ఇందుఁ దులసీరామాయణాది బహుగ్రంథములు ప్రకటితములు. ఏతత్తులసీరామాయణగ్రంథకర్తలును వేగుచుక్కగ్రంథమాల ప్రొప్రైటరులును భాగవతుల నృసింహశర్మగారు. ఈనాటకమందలి సారాంశము రామశాస్త్రిలు లక్ష్మమ్మ యను దంపతులు తమ యెనిమిదేండ్ల కొమార్తె కనకమును, అప్పలనరసింహముపంతులను నొక వృద్ధరాజకీయోన్నతోద్యోగి కిచ్చి పెండ్లిచేయుటయుఁ గ్రమముగా నది పెరిగి పెద్దదై కాఁపురమునకుఁబోయి వెంకటేశమను నొక యింగ్లీషుచదివిన టక్కరితో లేచిపోవుటయునైయున్నది. ఇం దేపాత్రిచేత నెట్లు మాటలాడింపవలయునో యట్లు మాటలాడించి రసము కురియఁబడినది. లోకులకు బుద్ధివచ్చున ట్లీగ్రంథకర్త యాయాపాత్రలచేఁ బ్రస్తుతానుభవములోనున్న కొన్నివిషయములను జక్కగాఁ జెప్పించియున్నవాఁడు. చూడుఁడు. ఒకవేశ్య వెంకటేశముతో నేమియనునో

చం... మా, పడపుఁబడంతు లేద్చుటకు బాపనసానులు లేచి, రింక మా
కడుపులు నిండవచ్చునె జగన్నుతకీర్తిఘృణీ! భిషఙ్మణీ! ...

సీ॥ కోమటిజగ్గయ్య కొంపముంకొనునట్లు
జోగి గావించె నియోగిభామ
మగవాండ్రి కియ్యది తగునె? భర్తం బాసి
స్వైరిణియయ్యె వ్యాపారినారి
రానివానిదె తప్పు, రతులను మెప్పింపఁ
జాలినజాణ వైష్ణవవధూటి
వాలుఁజూపులఁజూచి వలపించుఁ గుసుమాస్త్రి
ఘోటిఁబోలిన వెలనాటిజోటి
అతులబలులను బదిమందినైన నోర్చు
సాటిలేనట్టి కాసలనాటిబోటి

## విటుల గర్వం బడంచు ద్రావిడుఁ బ్రేడుచు
### సాను లమితక్షుధావ్యథాగ్లాను లౌరి.

గ్రంథమంతయు గ్రామ్యగద్యములోనే నడిపించెఁగాని యొక్కడేని యొకచోఁ బద్యమున్న నది కడు బాగుగానున్నది. గ్రంథకర్త కాలానుగుణముగా ధర్మశాస్త్రముల మార్చవలెననియుఁ బ్రౌఢావివాహములు చేయవలెననియు నను సంఘసంస్కర్తగానే కనఁబడుచున్నవాఁడు. గ్రంథము చాలభాగము వెంకటేశమను టక్కరితోనే నడచినది. అతఁడే కథానాయకుఁడు. ధనాశచేఁ జిన్నపిల్లఁ బెద్ద వాండ్రకిచ్చి పెండ్లిచేసిన వాండ్రే పడుచువానితో తగులుకొని లేచిపోవుదు రను నదియే యిందలి నీతి. మఱియు, ఇందలి వెంకటేశపాత్ర యేమాత్రమో యింగ్లీషు చదివిన యొక రౌడీ. కనుకనే యనుగాంగ్లభాషాధ్యేతలవలెఁ బ్రసంగములో నగ నింగ్లీషుపదములే వేయుచు వచ్చెను. పెండ్లిలేదు, పేరంటములేదు. అనేకుల కప్పుపడి యది తీర్చలేక చివరకుఁ జెన్నపట్టణము చేరెను. అక్కడికివచ్చిన యప్పుల వారి నంఘ్రులచే మర్దించి యదృశ్యుఁడగుచు వచ్చెను. కాఫీహోటలువారి కండ్లలోఁ గారముచల్లెను. పూటకూళ్ళరంగయ్యకుఁ బూడిదఁబూసెను. భోగముదాని నగ లన్నియు హరించి బుక్కాపకీరును జేసెను. మానిసి కొక పేరుచెప్పెను. తుద కుద్యోగార్థ మప్పులనరసింహముపంతులు నాశ్రయించి యాశ్రయించి యింటికిఁ దిరిగితిరిగి పాప మాయన పడుచుపెండ్లామును బక్కలోనికిఁ, గాదు కాదు, పరదేశమున కెత్తుకొనిపోయెను. కనుక నింతంత మోసగాం డుండు రనునదియు నేతద్గ్రంథపఠన ములనఁ దెలిసికొనఁదగిన యొకవిషయము. దీనివెల 1-8-0. వలయువారు వేగు చుక్కగ్రంథమాల, బరంపురమని వ్రాసికొనవలెను.

కాళీఘట్టరహస్యములు— ఒక నవల. గ్రంథకర్త దామరాజు వెంకటరమణ మూర్తిగారు. ఇదియు వేగుచుక్కగ్రంథమాలాప్రకటితమే. చదువఁజదువఁ జవు లూరుచు హాస్యరస మొలికించుచు నీగ్రంథము పఠనీయము శ్రవణీయము నైయుండె డిని. ఎచట నేది యుచితమో యచట నావర్ణనము మృదుమధురపదగుంఫితముగాఁ జాలవఱకుఁ జక్కగాఁ జేయఁబడినది. కాని యచ్చటచ్చటఁ బరిశీలించిన గ్రంథ కర్తకుఁ బాండిత్యము వ్యాకరణజ్ఞానము చాలనట్లు కన్పట్టెడిని.

ఇందలి పాత్రలన్నియు జారులు చోరులు వారనారులు జూదరులు త్రాఁగు బోతులు మోసగాండ్రు హంతకులు లోనగుప్రాకృతులవి. సారాంశము ప్రౌఢా వివాహ వితంతూద్వాహాచరణీయత. శ్లో॥ కథాపిఖలు పాపానా మలమశ్రేయసే యతః. పుణ్యపురుషార్థదూరములగు నిట్టి గ్రంథములు విధిబద్ధులుగాని యద్యతనయువ కుల వినోదార్థము వ్రాయఁబడుచుండఁబోలును. అట్టివే ప్రకృత మర్థార్జనసాధనము లగుచున్నయవి. కాళి కలకత్తాయందలి ప్రధానదేవత. అందువలన నన్నగరము కాళీఘట్టమునాఁ జెప్పఁబడును. అట్టికలకత్తాచరిత్రమగుట దీనికిఁ గాళీఘట్టరహస్య ములని గ్రంథకర్త పేరు విధించెను.

---

## గుంటూరుజిల్లా రీసెటిల్మెంటు.

(పి. వి. కృష్ణయ్యచౌదరి, యమ్ యల్ సి గారు.)

...భూమిపన్ను నూటికిరు 18-12-0 హెచ్చించుచున్నట్లు గుంటూరు రీసెటిల్మెంటాఫీసరుగారు చేసిన సూచనను గుఱించి (అక్టోబరు) 29, 30 తేదీలలో శాసన సభలో జరిగిన చర్చవిషయమై ... గుంటూరుమండలమువారీ క్రిందివిషయములను గమనింపఁదగును. 27వ తేదీ నేను మెమోరాండమును దాఖలుచేసిన రివిన్యూసభ్యులు సౌటరుగారు సిస్తుపెంపుదలనుగుఱించి విచారించుచున్నామనియుఁ దప్పనిసరిగా హెచ్చుచేయవలసివచ్చుచో నాబాధ్యత క్రొత్తచట్టముప్రకార మేర్పడఁబోవు శాసనసభలకు వదలివేయుచున్నామనియు నప్పటివఱకు గుంటూరుజిల్లాలో వసూలు చేయవలసిన హెచ్చుసిస్తు వసూలుచేయుటలేదనియు సదరుసిస్తు హెచ్చుచేయుట తగ్గించుట విషయమై నూతనశాసనసభలకే యధికారముండుననియు సెలవిచ్చిరి ... పెంపుదల యింకను జరుగకుండ ... మన మాందోళన సాగింపవలెను. ఈవిషయమై సుముఖులుగా నున్నందులకు సౌటరుగారికి మనము కృతజ్ఞులము(కావలయు).

---

## బ్రాహ్మణసన్మానము.

... భరతఖండము బ్రాహ్మణా ద్యనేకవర్ణంబులకు జన్మభూమియై తేజరిల్లుచున్నది. ఆదినుండియుఁ దద్వర్ణంబులవారు స్వవర్ణాశ్రమధర్మంబుల నాచరించుచు ...న్నారు. కనుకనే మత సాంఘిక పారిశ్రామిక రాజకీయాది వ్యవహారంబులలో నించుక వెనుకంజవేసినను నేఁటికిని భారతీయులు నామమాత్రావశిష్టులుగ నైన నున్నారు. దేశరక్షణకు క్షత్రియవైశ్యశూద్రు లెంతముఖ్యులో బ్రాహ్మణులు నంతకన్న నెన్నియో రెట్లవసరమని వారలకు...వేదాధ్యయనము తపస్సు నిత్యాదులు తప్ప నితరములు నియమింపఁబ(డియుండినవి కావు)...వారే నిజమైనబ్రాహ్మణులు. తద్బ్రాహ్మణుల జీవనమునకు క్షత్రియులే యుత్తరవాదులుగ నుండువారు. కనుకఁ బూర్వము బ్రాహ్మణు లందఱు వేదాధ్యయనసంపన్నులై దేశక్షేమమే తమ క్షేమముగా నెంచి క్షత్రియులకు...వ్యవహారంబులలోఁ దగుసలహాల నిచ్చి...క్షామాదులు గలుగుతఱిఁ దమ తపశ్శక్తిచే...పాఱఁదోలుచు దేశమును గాపాడుచుండువారు. కాని కాలక్రమమున స్థితిగతులు మాఱి...నవి...మార్పుచెందుచున్నను గొన్ని...కనఁబడుచున్నవి, వేదాధ్యయనసంపన్నుల నుచితరీతి సత్కరించుట కొన్నిస్థలములలోఁ జూచుచున్నారము. అట్టిసత్కారము లుండినఁగాని... వేదపుగనులఁ ద్రవ్వుటకు బ్రాహ్మణుల కవకాశముండదు ... వేదాధ్యయనసంపన్ను లుండి తపస్సు లాచరించినఁగాని దేశ మభివృద్ధినంద నేరదు ... నవనాగరికు లెన్నిప్రయత్నములఁ జేసినను దపస్సుచే సంపాదించిన శక్తి లేనిది నిష్ప్రయోజనము...వర్తమానంబున... నూతనశక్తులు మనయాంధ్రప్రపంచమున నావరించుచున్నవి ... బ్రాహ్మణసన్మానములఁ గావించుచున్నారు. (రామచంద్రేంద్రసరస్వతీ (అప్పావధాని) స్వాములవారి వంటి మహనీయులచేత వేదోద్ధారకపరిషత్తులు స్థాపితములు. ముదిగొండ వేంకట

రామశాస్త్రిగారివంటి సత్పండితులచే వేదవేదాంగవిద్యాపీఠములు స్థాపింపఁబడఁబోవుచున్నవి. తద్వివరములు మఱియొకపరి ప్రకటింపఁబడఁబోయెడిని) ... వృక్షములు నదులు పర్వతములునే తమతమకృత్యముల నెఱవేర్చుచుండ యుక్తాయుక్తవిచక్షణగల మానవబృందము స్వవిధుల నెటుల నతిక్రమింపఁగలదు ? ... భారతమాతా ! నీపుత్రరత్నములు ప్రమాదవశంబున స్వధర్మముల విసర్జించి నిన్నారాధించుట మఱచినను మరలఁ బ్రాచీనచరిత్రలు తిలకించి...నిన్నున్నతాసనంబున నధిష్ఠింపించుటకుఁ బ్రయత్నించెదరు గాక,

దేశాభిమాని.

---

## —♦ రామకృష్ణపరమహంస ♦—

(తిరుపతివేంకటేశ్వరకవులు)

మ॥ కరుణాదూరత నూరకే బలిగ నక్కాళీమహాదేవికై
నరులంజంపెడి వంగదేశపు ద్విజన్మస్తోమమం దెట్టులో
పరమార్థజ్ఞుఁడు రామకృష్ణుఁడు పరబ్రహ్మపరాంశమ్మునన్
ధరణిం బుట్టె, తదీయచిత్రచరితల్ ధ్యానింపఁగాఁ జెల్లవే ?

సీ॥ చదువనే లేదఁట శాస్త్రాదుల నొకింత
గురువయ్యె నేలాటిగురువులకును
అనుభవింపకయె యేలా చెందెనో విరక్తి
ఏవిరాగులు నేర రీసమాధి
తనకన్న నితర మింతయు లేదనియెఱింగి
యును గాళికార్చనమును బొనర్చె
ఈయుగమ్మునను లేనేలేనిమహిమ లె
న్నెన్నియో చూపె నిరీహుఁడయ్యు
అనుచుఁ జెప్పెద రయ్యనఘాత్ముచర్య
విధినిషేధము లెఱుఁగక వేదవేత్త
లైన విద్వాంసులకును మాన్యత వహించి
తనరు శ్రీరామకృష్ణున కెనయె యొరులు ?

శా॥ ఏయోగీంద్రుని శిష్యుఁ డొక్కరుఁడు దా ద్వీపాంతరంబేగి వి
ద్యాయుక్తిం దగ వారి లోఁబఱచి ధ్యేయం బద్దియే యంచు న
జ్ఞేయంబై చను తత్త్వముం దెలిపి యెన్నే దుర్మతాల్ మాపె, సు
శ్రీయుక్తుం డల రామకృష్ణుసరి యేరీ జ్ఞాను లెందేనియున్ ?

ఉ॥ వేదము పిచ్చి శాస్త్రమన వెఱ్ఱియ ధర్మ మదెద్ది యంచు వా
గ్వాదము సేయు నిట్టి కలికాలమునందును నెవ్వఁడో యొకం
డాదిమకాలమందుబలె నార్యుఁడు పుట్టఁగవచ్చునంట దు
ర్వాదముగామి కియ్యనఘువర్తనమే యొకసాక్షి నాఁదగున్.

తే॥ వేదములు కష్టపడి వల్లెవేయనేల ?
శాస్త్రములలోఁ బరిశ్రమ సల్పనేల ?
రామకృష్ణపరమహంసరాజు నోడువు
నట్టిబోధల నీయర్థ ముట్టిపడెడి.

---

## —♦ నిజాము రాష్ట్రసేవ ♦—

(శేషాద్రిరమణకవులు)

సీ॥ ప్రాక్పయోరాశి తరంగడోలికలపై
ఆమోదమెసఁగ నుయ్యాలలూఁగి
శ్రీశైలవిశ్వేశ సేవాసమారబ్ధ
మహితసౌభాగ్యసంపదలఁ దనరి
కల్యాణపురరాజ్య కల్యాణసమధికై
శ్వర్యసంపదలెల్ల సంగ్రహించి
మాల్యవత్సహకార మంజరీమకరంద
కలితమందానిలంబులను దనిసి
ఆంధ్రవాఙ్మయరంగ స్థలాంతరమున
ఆటలాడిన కాకతీయాంధ్రరాజ్య
విభవములఁ గావ్యగతము గావింపరేల
ప్రోలుమాలి నిజామ్‌రాష్ట్రవాసులార !

సీ॥ విజ్ఞానచంద్రికా విభవంబుతోలుదొల్తఁగాఁగా జేసినకర్మభూమి
ఆంధ్రకావ్యంబుల నంకితంబొందిన యవనన్నపాలురయంగణంబు
భాషకై త్యాగసంపదను జూపినరావిచెట్టు రంగారావుజీవగడ్డ
శ్రీకృష్ణరాయధాత్రీనాథుపేర గ్రంథాలయరాజ మున్నట్టిచోటు
వితరణమునకు సుజ్ఞానవిభవమునకు
వన్నె కెక్కిన శూరనివాసభూమి

భాగ్యనగరంబు మీకుఁ దోడ్పడఁగఁగలదు
బయలుదేరు నిజామ్(రాష్ట్రప్రజ ! రయంబ.)

సీ॥ పచ్చికండలు నెత్రు పంకిలంబుగఁ జేసి
తెలుఁగుపౌజులు పోరఁ దెగినతావు
వీరశైవమతాసి విశ్వసంహారతాం
డవ మాడినట్టి క్రీడాగృహంబు
సారస్వతసుమంబు సౌరభమంద మం
దానిలంబులు వీచినట్టితావు
ఆంధ్రశిల్పప్రౌఢి యాంధ్రవిక్రమ రేఖ
జాలుగాఁ బాఱిన శాద్వలంబు
రాచనెత్తుటఁ బితకుఁ దర్పణ మొసంగి
ఆంధ్రభార్గవుఁడు కృతార్థుఁ డైనతావు
నేఁటియుగమున కేమిసందేశ మొసఁగఁ
జాలదోకో నిజా(మ్ రాష్ట్రజనము) లార !

సీ॥ మాధవవర్మపై మమతతోఁ బద్మాక్షి
దివ్యాయుధంబుల దించెనంచు
కడుపుకుక్కురితిచేఁ గడలేని వెతలొంది
సిరియాలదేవి కృశించెనంచు
మాదికేశవభట్టు మేదినీశునకయి
బ్రహ్మరాక్షసుఁడయి ప్రబలెనంచు
శరణాగతుని బ్రోవసమకట్టి బ్రహ్మయ్య
కొఱతకైనను నియ్యకొనియెనంచు
స్థానికచరిత్రములలోనఁ జదువునప్పు
డాంధ్రతేజస్సు కనులముం దాటలాడు
నాఁటి యావేశమే మది నాఁటునట్లు
రమ్ము దీపింపుము నిజామురాష్ట్రమాత !

సీ॥ ప్రత్యక్షదైవమై భద్రాచలంబున
శ్రీరామమూర్తి వీక్షించుచుండె

కలిమలాహరుఁడయి కాళేశ్వరంబున
శంకరుండు శుభం బొసంగుచుండె
అనుఁగుసైదోడయి యయ్యనవోలున
మైలారుదేవుండు మనుచుచుండె
సేవకకల్పమై శ్రీయాదగిరియందు
లక్ష్మీనృసింహుం డెలర్చుచుండె
ఆంధ్రులకుఁ దోడునీడయి హనుమకొండ
దరిని బద్మాక్షి ప్రేమతో నరయుచుండె
దైవబలముండి వాఙ్మయోద్యమములందుఁ
బ్రతిఘటింతె నిజామ్‌రాష్ట్రవాసులార!

సీ॥ తీరంబు లొరసి నిండారఁబాఱుచునుండు
గోదావరీనదీ స్వాదుజలము
రసవంతమై మకరంద సారముఁబోలు
పోతన సుకవితాపూతధార
ఆంధ్రసామ్రాజ్య ముఖ్యస్థానమగు నోరు
గల్లుపురీ పూర్వగౌరవంబు
రామప్పగుడి సహస్రస్తంభమంటపం
బుననున్న శిల్పవిభూతిరేఖ
ప్రతిమహీధర శిఖరసంగతములైన
దుర్గములయందుఁ దోఁచు నిసర్గశోభ
చిరతరపురాకృతంబునఁ జేసికాదె
మీకు (దొరకె నిజామ్‌రాష్ట్రలోకు) లార!

సీ॥ కోరినభక్తుల కొంగుపసిండియై కాళేశ్వరుఁడొసంగు కామితములు
కాంతలపాలింటి కల్పవృక్షంబయిపద్మాక్షియొసఁగు సౌభాగ్యసమితి
సాధుజనాళికి సంతానభూజమై మైలారుఁ డొసఁగు నిర్మలభూతి
దానులపాలిచింతారత్నమై యాదగిరి నృసింహుం డిచ్చుచిరసుఖంబు
ధన్యులెల్లరు నేకీకృతంబొనర్చి
మాతృభాషాభివృద్ధి కమర్చునట్లు
బిడ్డలను జేరఁబిల్చి దీవింప, విట్టి
రాజసం బేలొకో నిజామురాష్ట్రమాత!

## —* గురుప్రీతి - శిష్యదుర్నీతి. *—

(న్యాయవిద్యాప్రవీణ, అం॥ నరసింహశాస్త్రిగారు, పుష్పగిరి సం॥ పం॥)

వెనుకటిదినములలోఁ గృతాదియుగములలోఁగాదు కలియుగప్రారంభదినములలో గురుశిష్యుల రాగరజ్జువులు పట్టుసడలకుండ నుండెడివి. గురువునకు శిష్యుల విధేయతాదికము చేత వారిపయి నొకవిధమగు...నిగూఢవాత్సల్య ముదయించుచుండెడిది. శిష్యునికిఁ గూడ గురుని మహత్త్వౌదార్యాదిగుణముల చేతనో జన్మాంతరీయమగు వాస...నవలననో యాయనపయి భక్తి ... ప్రబలుచుండెడిది. శిష్యు లనేకు లున్నను నొక్కొకనియందు వానివాని విధేయతాసంపత్తినిబట్టియో ... భవితవ్యతా ప్రాబల్యమునుబట్టియో గురుని కవ్యాజానురాగ ముదయించుట శిష్యుఁడా వాత్సల్యప్రవాహమున కెదురీఁదఁజాలక జీవితాంతముఁ దత్పాదపద్మారాధనయందే నిమగ్నుఁడై యుండుట సంభవించుచుండెడిది. ఇట్టి గురుశిష్యభావము శ్రుతమే కాని దృష్టము కాదు.

తరువాతఁ గాలాశ్వము క్షుణ్ణములైన పూర్వమార్గముల వదలి వ్యుత్క్రమమార్గములలో విచ్చలవిడి విహారము చేయ మొదలుపెట్టినది. మంచి చెడ్డ చెడ్డ మంచిగా సర్వముఁ దాఱుమాఱై పోయినది. శిష్యుని కుండవలసిన విధేయత ప్రశ్రయ మారుతమునకైనను జలించని దృఢభక్తి విశ్వాసము గురుదేవతాభావముఁ గలలోఁగన్నట్టు కనఁబడకుండఁబోయినవి. చివరకు మిగిలిన దేమి ? శిష్యుని జీవచ్ఛవము. గురువు లేఁడు. శిష్యుఁడు లేఁడు. జాతిలేదు. నీతిలేదు. మంచిలేదు. చెడ్డలేదు. ఆనాఁటిరోజులాత్మవాదములోని యథ్యయాంతము నావృత్తిచేయుచున్నవి. ఇవి మధ్యకాలపు రోజులు.

ఆ...అవాంతరప్రళయము నరికట్టుటకై యాదిశంకరులే యవతరించవలసి వచ్చినది. అవతరించినారు. దిగ్విజయ మైనది. అద్వైతమతమున కాయుర్వృద్ధికై యాశీర్వదించినారు. ధర్మవ్యుత్క్రమము జరుగకుండుటకై నాల్గుదిక్కులను నాల్గుపీఠము లేర్పఱచినారు. నాఁటినుండి నేఁటివఱకు ధర్మ మెట్టిచెక్కుఁ జెదరక సుస్థిరముగనే నిల్చియున్నది. ఆ...పరంపరలోనిదే మన పుష్పగిరిపీఠము.

విద్యారణ్యులకాలమునుండియు నీపీఠలతిక శ్రీచంద్రమౌళీశ్వరుని నిత్యాభిషేకోదకస్నాపితమై దినదినాభివృద్ధి నందుచునే యున్నది. నేఁడీపీఠాధిష్ఠాతలు శ్రీమదభినవోద్దండవిద్యానృసింహభారతీస్వాములవారు. ఉత్తమమహాపురుషలక్షణముల నామహనీయుని యూర్ధ్వరేఖలే చాటుచున్నవి. శంఖ చక్ర పద్మ మత్స్యాది రేఖలన్నియు నామహామహుని కరతలామలకములై విరాజిల్లుచున్నవి. వర్తులమగు ముఖము విశాలములై ప్రసన్నములగు నేత్రములు క్షణకోపము స్వసౌఖ్యనిస్పృహ శిష్యవాత్సల్యము నీమహాత్ముని కుగ్గుపాలతో నలవడిన గుణములు. ఇట్టి మహాత్ముని పాలనలోననే యుండి కాల మెన్నికడగండ్లుపడినను నార్థికదుస్థితి యెంతయావరించినను గడుపులోని నీళ్ళు కదలకుండఁ గష్టమునునది యెఱుఁగక యసూర్యంపశ్యములై కొన్నికుటుంబములు బ్రతుకుచున్నవి. కాని పామునకుఁ బాలువోసినకొలఁదిని విషమే వృద్ధిపొందునట్టు లాస్వామి వీరల కిచ్చు భృతియంతయు దుర్నీతి పెచ్చుపెరు

గుటకే ... యయ్యెను. శ్రీస్వామివారు పూర్ణారోగ్యము చేతఁబట్టినంతకాల మీ కృపణశిష్యుల దుర్నీతి వారియెడ ఫలించలేదు. కాని వారికి శరీరానారోగ్యము సంభవించుట సంచారము చేయు దార్ఢ్యము లేక యేకత్ర స్థిరనివాస మేర్పఱచుట దివాన్ మొదలగు నున్నతోద్యోగులు సమీపమున లేకుంట మొదలగు నన్నియుఁ గలికాలానుగుణముగ వారి దుర్నీతి ఫలించుట కుపయోగపడినవి. ఒకటి రెండుమాఱులు వారలు స్వీయధనాపహరణ మొనర్చినను శ్రీవారు సహజవైరాగ్యమువలనను నాశ్రితవాత్సల్యమువలనను నుపేక్షించనే యుపేక్షించిరి. అయినను నాశ్రయించిన దుర్మార్గులు వారి యౌదార్యమునైనను గణింపక శ్రీచంద్రమౌళీశ్వరుని కత్తిమీఁది సామునైనను విచారింపక యింటిలోఁ దిని యింటివాసముల లెక్కపెట్టినతీరున దుస్స్వభావులై చంద్రమౌళీశ్వరుని హేమపాత్రముల నపహరించిరి. గుండ్రాతిని దాఁచినమాత్రమున గూఁతు పెండ్లి యాఁగనటుల దీనివలన శ్రీచంద్రమౌళీశ్వరుని నిత్యార్చనములకుఁగాని శ్రీగురుస్వాములవారి యనుష్ఠానమునకుఁగాని యెట్టిలోటును లేదు కాని యపహర్తల వంశములుమాత్ర మాంధ్రదేశమున నామరూపములు లేకుండ నంతరించు పరిస్థితి యేర్పడినది. దీనివలన లోకులు కాకులగుటచే రంధ్రాన్వేషణమే ప్రధానలక్ష్యముగా నుంచుకొని సంచరించు దుస్స్వభావులగుటచేఁ గపటసూత్రములచే నపవాదములఁ బుట్టించి సత్యముగఁ బ్రకటింప...చతురులగుటచేఁ బలువిధములగు దురూహలు పడినఁ బడుదురుగాక. శ్రీస్వామివారిని దూలనాడిన దూలనాడుదురుగాక. దీనివలన సంభవించెడి ఘోరపాతకమునకుఁ దామే యుత్తరవాదు లయ్యెదరుకాని పుష్కరపలాశమువలె నిర్లిప్తులగు శ్రీస్వామివారి కెట్టిమాలిన్యము సంభవించనేరదు. శ్రీస్వామివా రధిపతులే కాని వారికి జరుగవలసిన సకలోపచారములు పరహస్తములచేతనే జరుగవలయును. వారు జగత్కుటుంబులగుటచే వారికి స్వీయపరకీయభేదభావము లుండవుకాని యాశ్రయించిన దుష్టుల కట్టి భేదబుద్ధి లేకుండునా? ఇనుపపెట్టెలతాళపుఁజెవు లొకచోటను దీయువా రొకరును వేయువా రొకరునునై ప్రాచీనములగు కట్టుబాట్లతోనే నేఁడుగూడ వచ్చుచున్నది. కాని నేఁటి కిట్టి మహత్తమమగు నపవాదము సంభవించవలసిన దుర్యోగముండుటచేత నిట్లయినది. మరలఁ బాత్రములజాడలకై చేయవలసిన పురుషప్రయత్నమున కెట్టి లోటును లేకుండఁ బూర్ణముగ జరుగుచునే యున్నది. దైవానుగ్రహమునకుఁ గావలసిన విశేష జపములు విశేష పారాయణములు జరుగుచునే యున్నవి. ఈవిషయమున గురుదేవతాభక్తాగ్రగణ్యులగు సత్తెనపల్లి సర్కిలినస్పెక్టరుగారును, సబినస్పెక్టరుగారగు తంగిరాల సత్యనారాయణగారును శ్రీచంద్రమౌళీశ్వరప్రేరితులై దృఢమైన యభినివేశముతోఁ బాటుపడుచుండుట మిక్కిలి కొనియాడఁదగినయంశము. నాఁటి నేఁటిపరిస్థితులనుబట్టి చూడఁగా నాకుఁదోఁచిన యభిప్రాయ మిది. నాఁటివేత్రధరులు నేఁడు దండధరులైరి. నాఁటి పరిచారకులు నేఁడు యమకింకరులైరి. నాఁటి గుమాస్తాలు నేఁడు చిత్రగుప్తులుగనో, విచిత్రగుప్తులుగనో మాఱిరి. ఇదివఱకుఁ గడచిన దేదో గడచినది. ఇఁక...దుష్టగ్రహావేశమునుండి బయటఁబడి యీసంస్థానము పూర్వముకన్న నుత్కృష్టమగు శోభాతిశయముల నొందఁగలదని మా నమ్మకము.

---

## —♦ రాజశేఖరుఁడు. ♦—

(మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.)

లోకప్రసిద్ధంబగు పేరుగాంచిన మహాకవులలో నొకఁడగు నీతనిఁగూర్చి యనేక ప్రాచీనకవులును నవీనవిమర్శకులును మిక్కిలి ప్రసంగించియుండిరి. సాయన మాధవాచార్యుని శంకరవిజయంబున రెండుమూడుచోట్ల నాటకకర్తయని ప్రసంగింపఁబడిన కేరళక్షితిపాలుఁడగు రాజశేఖరుఁడు శంకరభగవత్పాదుల సమకాలికుఁడగు మఱియొక రాజకవి కావచ్చుననిన దుర్గాప్రసాదపండితుల యభిప్రాయము యుక్తియుక్తమని నమ్మఁదగును. బాలరామాయణాదికర్తయగు మన రాజశేఖరుఁడు తనకావ్యంబుల మహేంద్రపాలరాజును వర్ణించియుండెను. ఈరాజునుగూర్చి యిండియన్ అంటిక్వెరీ ౧౫ వ భాగములో ఓంస్వస్తి. శ్రీమహోదయసమావాసితానేకగోహస్త్యశ్వరథపత్తిసంపన్నస్కంధావారాత్, పరమభగవతీభక్తో మహారాజ శ్రీభోజదేవస్తస్యపుత్రస్తత్పాదానుధ్యాతశ్రీచంద్రభట్టారికాదేవ్యాముత్పన్నః పరమభగవతీభక్తో మహారాజ శ్రీ మహేంద్రపాల శ్రావస్తిభుక్తౌ శ్రావస్తిమండలాంతఃపాతి వాలయికావిషయసంబద్ధ పానీయకగ్రామసముపగతాన్ సర్వానేవ యథాస్థాననియుక్తాన్ ప్రతివాసినశ్చ సమాజ్ఞాపయతి. సంవత్సర. ౧౦౦ ౫౦ ౫ మాఘ సుది ౧౦ నిబద్ధం” అని మహేంద్రపాల దానపత్రము ముద్రితమైయున్నది. ఇది హర్షవర్ధన రాజ్యారంభకాలమనియు దీని ... కయిన క్రీస్తువత్సరములు ౬౦౬ కలిపినయెడల ౭౬౧ వచ్చుచున్నదనియు నిదియే దానపత్రసమయమనియు డాక్టరు ప్లేటుగారి యాశయము. దీనింబట్టియే యాతని యాశ్రితుఁడగు రాజశేఖరుఁడు ౯ వ శతకము పరభాగమున నుండుననని యొకరిద్దఱు నిర్ణయించిరి. కాని దానపత్రములోని సంఖ్య దురూహ్యముగా నున్నదనియు దానింబట్టి హర్షవర్ధనకాలము కల్పించుటయు నక్కాలంబున మహేంద్రపాల రాజశేఖరు లుండిరనుటయు యుక్తియుక్తముగా లేదనియుఁ జాలమంది యభిప్రాయము. ఔను నిజమే. రాజశేఖరుఁడు ౧౦ వ శతాబ్దము పూర్వభాగములో నుండెనని యనేకనిదర్శనము లుండఁగాఁ బై తప్పులెక్కనెవఁడు విశ్వసించును ?

ఈదానపత్రము కాలనిర్ణయమునకు మాత్రమే సరియైనమార్గము చూపకున్నది కాని మన కవికిని నాతని ప్రభువునకును సంబంధించియే యున్నది...దానపత్రములోని మహోదయము మహేంద్రపాలుని రాజధానియగు మహోదయమును నామాంతరంబుగల కాన్యకుబ్జమైనట్లుగా “కాన్యకుబ్జం మహోదయం, మహోదయః కాన్యకుబ్జే” అను విశ్వప్రకాశ మేదినీనిఘంటువులవలనను బాలభారత ప్రస్తావనలోని మహోదయనగరప్రసంగమువలనను బాలరామాయణ దశమాంకములోని రామలక్ష్మణవచనములుగానున్న ‘మందాకినీపరిక్షిప్తం మహోదయంనామ నగరం’

శ్లో. ఇదమద్వయం సర్వమహాపవిత్రం పరస్పరాలంకరణైకహేతుః
పురంచ హేజానకి! కాన్యకుబ్జం సరిచ్చ గౌరీపతిమౌళిమాలా.

అను వాక్యపద్యంబులవలనను ధ్రువమగుచున్నది. పై దానపత్రమునుబట్టి కొందఱు నిర్ణయించిన కాలమే కవికాలమని చెప్పినయెడల ౭౩౦లోఁ గాన్యకుబ్జంబు నేలిన యశోవర్మకును నాతని కవియగు భవభూతికిని మన రాజును గవియు సమకాలికులు గావలసివచ్చును. అట్లయినయెడల భవభూతిని సుబంధువు వానిని గవిరాజు వీరిముగ్గురిని రాజశేఖరుఁడు కాలక్రమంబున వారిగ్రంథముల స్మరించుట యెట్లు తటస్థించును ? ఇదిగాక కాన్యకుబ్జంబును యశోవర్మ యేలుచుండఁగా మహేంద్రపాలుఁ డేలెననుట యసంభవము. కావున భవభూతి రాజశేఖరుల యంతరము తుద కొక్క శతాబ్దముకంటె నధికముగా నుండవలయునని తేలుటచే ననేకవిమర్శకసమ్మతంబుగా మన కవికాలము ౮౮౪ తటస్థించుచున్నది. ఇట్లే ప్రొఫెసరు వీబరు మొదలగువారు తెలిపియుండిరి. మఱియు, ౧౦వశతకము కట్టకడనున్న భోజరాజు పెత్తండ్రియగు ముంజ (వాక్పతిరాజ) మహీపాలుని యాస్థానకవియగు ధనికకవి దశరూపావలోకంబున నీతని కర్పూరమంజర్యాదులలోనిపద్యము లుదాహరించుటచేఁగూడ మనకవి దశమశతకాంతిమభాగంబునకుఁబూర్వుఁడు గావలసియున్నది. దీనిచేతనే మనకవి ౧౧వశతకము నంతంబున నుండెనను విల్సనుపండితుని యభిప్రాయంబును ౧౪ వ శతకమున నుండెనను మాక్సుముల్లరు నాశయంబును, నిరాకృతంబులగుచున్నవి. ఇదియుంగాక ౮౮౪ లోఁ గాశ్మీరము నేలిన యవంతివర్మ సమకాలికులగు నానందవర్ధన రత్నాకరుల నితఁడు నుతించినట్లుండుటచేతను శా॥ శ॥ ౮౮౧ (క్రీ॥ 959) లో యశస్తిలకచంపువు రచించిన జైనసోమదేవుఁ డీతని నుతించినట్లుండుటచేతను మన కవి వీరి మధ్యకాలంబులోనివాఁడని స్పష్టపడుచున్నది. కావున నెవ్విధంబున నాలోచించినను రాజశేఖరకవి క్రీ॥ శ॥ 834, 950 నడుమ నుండెననుట నిశ్చయమగుచున్నది. ఈకవి తన నాటకప్రస్తావనలోఁ దన్ను రాజగురువని పల్కించుకొనుటచేతనే బ్రాహ్మణుఁడని తెలియుచున్నది. విద్ధసాలభంజికా బాలరామాయణ ప్రస్తావనలలో నున్న “ అకాలజలదస్య ప్రణప్తుః.

శ్లో॥ సమూర్తో యత్రాసీ ద్గుణగణ ఇవాకాలజలదః
సురానంద స్సోపి శ్రవణపుటపేయేన వచసా
నచాన్యే గణ్యం తే తరలకవిరాజప్రభృతయో
మహాభాగ స్తస్మి న్నయ మజని యాయావరకులే.

తదాముష్యాయణస్య మహారాష్ట్రచూడామణే రకాలజలదస్య చతుర్థో దౌర్దుకిః శీలవతీసూను రుపాధ్యాయ శ్రీరాజశేఖర” యను వాక్యమువలన నీతఁడు మహారాష్ట్రదేశస్థుఁడనియు నకాలజలదకవికి మునిమనుమని కొడుకనియు యాయావరనామకవంశమున జన్మించినవాఁడనియు మహేంద్రపాలవర్ణనమునుబట్టి స్వదేశము విడిచి కాన్యకుబ్జంబునకు రాజాశ్రయంబున వచ్చెననియుఁ దెలియుచున్నది. ఈతఁడు రచించినవి బాలభారతము కర్పూరమంజరి విద్ధసాలభంజిక బాలరామాయణమనను నాలుగు గ్రంథములు లోకంబున వ్యవహరింపఁబడుచున్నవి. కాని యీతఁడు

బాలరామాయణప్రస్తావనలో వ్రాసికొనిన విద్ధినష్టప్రబంధా ననువాక్యమువలన శ్రీహర్షవిక్రమాదిత్యజీవితములో వ్రాసినట్లుగా డాక్టరాపర్ధుదొరవారు సేకరించినట్లు తెలియుచున్న సవ్యాఖ్యాలిఖిత సట్టకమును సుభాషితావళ్యాదులలోని కవివిషయంబు లగు రాజశేఖరుని పెక్కుశ్లోకంబులను బట్టి కొంద ఱూహించినట్లుగాఁ గవివిమర్శమను గ్రంథము నీతనిదేయని విశ్వసింపఁదగుటచే నితఁ డా గ్రంథములు రచించినట్లు ధ్రువమగుచున్నది. పై నాలుగుగ్రంథములలోఁగూడ నీకవి రఘుకులచూడామణియగు మహేంద్రపాలదేవుఁడు తన శిష్యుఁడని వర్ణించి బాలభారతప్రస్తావనలో విశేషముగా రఘువంశముక్తామణియు నిర్భయనరేంద్రపుత్రుఁడు నగు మహీపాలదేవుని వర్ణించెను. కర్పూరమంజరీప్రస్తావనలోఁగూడఁ దన సమకాలికులగు మృగాంకలేఖా కథాకారాపరాజితకవులు తన్ను నుతించినట్లుగా బాలకవిః కవిరాజో నిర్భయరాజస్య తథోపాధ్యాయయని చెప్పికొనెను. ఈయంశములనుబట్టి చూడఁగా మహేంద్రపాలునికే నిర్భయరాజను నామాంతరము గలదనియు నాతనిపుత్రుఁడు మహీపాలదేవుఁడనియుఁ దండ్రికొడుకుల కిద్దఱకు నీకవి గురుఁడై వారి యాస్థానమున నుత్తమపదము నొందియుండెననియు విశదమగుచున్నది. ఈతని బాలభారతమునకుఁ బ్రచండపాండవమను నామాంతరంబు గలదు. రాజశేఖరకవే ర్మహాత్మనో బాలభారత మిదంహి నాటకమని ప్రస్తావనలో నుండుటచే నిది తుద కైదంకములుగలదియైనను గావలయును. కాని దీని రెండంకములు మాత్రమే వ్యవహారంబున నున్నవి. దీని ధోరణిఁ జూడఁగాఁ గవి బాలరామాయణమువలెనే భారతకథను సంగ్రహించి పదియంకముల రూపకముగా రచించియుండునని తోఁచుచున్నది. అట్లుకానియెడల దీనికిఁ బ్రచండపాండవమను నామమే చెల్లదు. ప్రథమాంకములో వ్యాసప్రవేశము రాధావేధము (లక్ష్యవిశేషమునుగొట్టుట) పణముగాఁగల ద్రౌపదీస్వయంవరమున కెల్లరాజులు వచ్చుట బ్రాహ్మణవేషధరుఁడగు నర్జునుఁడు దానిని గొట్టి పందెము గెలుచుట పరరాజులయాగ్రహము వర్ణింపఁబడినవి. రెండవదానిలో దుర్యోధనుఁడు ధర్మరాజును ద్యూతమునకుఁ బిలుచుట యామాయజూదమున నితఁడు శకునిమూలముగా సర్వము నోడుట దుశ్శాసనావమానితయగు ద్రౌపది ప్రతిజ్ఞ పాండవులు వనవాసమున కేగుట ... వర్ణింపఁబడినవి. కర్పూరమంజరి యొక సట్టకము. ప్రవేశకము విష్కంభము లేనిదై యంకములకు బదులుగా నాలుగు జవనికాంతరములు గలిగి ప్రాకృతభాషామయమైన రూపకము సట్టకమనఁబడును. ఇట్టిసట్టకము రచించుటకుఁ గారణము కవి సంస్కృతవాక్యములు కఠినములనియుఁ బ్రాకృతవాక్కులు సుకుమారములనియుఁ బురుషులకుఁ గాంతలకుం బోలె వానికి విశేష మంతరము గలదనియుఁ జెప్పెను. మఱియు నిక్కవి పారిపార్శ్వకవచనంబుగాఁ దనపత్నియుఁ జాహువానకులసంభూతయు నైన యవంతిసుందరి కోరఁగా దీనిని బ్రయోగించినట్లు చెప్పుటయుఁ గథలోని స్త్రీపాత్రల కవితారసజ్ఞతను వర్ణించుటయుఁ జూడఁగా నక్కాలంబున స్త్రీల విద్యాభిమానమును గౌరవంబును గోచరము లగుచున్నవి.

శృంగారరసప్రధానంబగు దీనియందుఁ జండపాలభూవరుఁడు వినోదార్థముగా నద్భుతసిద్ధిగల భైరవానందుఁడను యోగీశ్వరునిచే మంత్రబలమునఁ దనయింటికి రప్పింపఁబడిన తనపట్టమహిషి పినతల్లికూఁతురును గుంతలదేశరాజు పుత్రికయు నగు కర్పూరమంజరిని బరిణయంబగు కథాభాగము సవిస్తరముగా సరసముగా సులభశైలిని వర్ణింపఁబడినది. ఈతని కవితాశక్తి గౌరవంబుల కాలవాలమై ప్రసిద్ధిగాంచిన యీ నాటకంబు కథను వివరింప నవసరములేదు కావున నొకటిరెండుపద్యములుమాత్ర ముదాహరించెదను.

శ్లో॥ కర్పూరఇవ దగ్ధోపి శక్తిమాన్ యో జనే జనే
నమో స్త్వవార్యవీర్యాయ తస్మై మకరకేతవే.

దీనివలన మాడ్చినను బచ్చకర్పూరము శక్తి నశింపదను వస్తుతత్త్వము బోధింపఁబడుచున్నది. సీత భర్తతో నడవికివెళ్లినపిదప నామెవార్తను సుమంత్రుఁడు దశరథునకుఁ జెప్పు సందర్భమున నున్న మసృణచరణపాతం గమ్యతాం భూస్సదర్భా విరచయ సిచయాంతం మూర్ధ్ని ఘర్మః కఠోరః, తదితి జనకపుత్రీ లోచనై రశ్రుపూర్ణైః పథి పథికవధూభి ర్వీక్షితా శిక్షితాచ యనుశ్లోక మెంతయు శృంగారకరుణారససారస్య మొలికించుచు దీని కిదియే సాటియనున ట్లున్నది. మార్గములోఁ బతివిరహితలగు స్త్రీలు సీతను జూచి "అమ్మా! త్రోవ దర్భాంకురములతో నిండియున్నది మెల్లగా నడుగులిడు"మనియు "యెండ తీక్ష్ణముగానున్నది చీరచెఱఁగు నెత్తిమీఁద వేసికొను" మనియు బాష్పపూరితనేత్రలై యనురాగంబున బోధించిరఁట. ఇందు సీత సౌకుమార్యము నామె యరణ్యగమన విచారము నిర్వచింపఁబడుటయే కాక సీతవలె మనకుఁ బతినను సరించిపోవు భాగ్యము సంభవించినదికాదుకదాయను వియోగినుల మనోవైకల్యముగూడ సూచింపఁబడినది. విద్ధసాలభంజిక నాలుగంకముల రూపకము. కేవల కల్పితకథ యగునాటిక. కేవల శృంగారరసభూయిష్ఠంబై సరసజన హృద్యంబుగా నుండును. ఇందు మృగాంకలేఖా విద్యాధర మల్లదేవుల యను రాగము పూర్ణముగా వర్ణింపఁబడినది. శృంగారరసము

శ్లో॥ దృశాదగ్ధం మనసిజం జీవయంతి దృశైవ యాః
విరూపాక్షస్య జయినీ స్తా స్తువే వామలోచనాః.

అను మంగళాచరణపద్యంబువలననే సూచింపఁబడుచున్నది. విరహాతురుఁడగు కథానాయకుని వచనంబగు నొక్కపద్య ముదాహరించెదను.

శ్లో॥ శ్యామాం శ్యామవిమాన మానయత భోస్సాంద్రై ర్మషీకూర్చకైః
మంత్రం తంత్ర మథ ప్రయుజ్య హరత శ్వేతోత్పలానాం శ్రియమ్

చంద్రం చూర్ణయతి క్షణాచ్చ కణశః కృత్వా శిలాపట్టకే
యేన ద్రష్టుమహం క్షమే దశదిశ స్తం క్రిముద్రాంకితాః.

ఇట్టిమహాకవుల కృతులఁ జదివి యానందింపవలయునుగాని స్థాలీపులాకన్యాయంబుగ విమర్శించుటచే నేమితనివితీఱును ?

---

## —♦ ...పశ్చిమదేశపు ధర్మపద్ధతి ♦—

ఆంగ్లేయదేశమునందు యాచకవృత్తి నిరసించఁబడుటయే కాక శాస్త్రవిరుద్ధముగూడ నైయున్నది. బిచ్చమెత్తుకొనుట నేరము. అయినను నక్కడక్కడఁ గొందఱు గ్రుడ్డివారును వికలాంగులును గనఁబడుచునే యుందురు. వారేదోవీథిలో నొకచోట నిలువఁబడి బల్లపై నాకాళ్ళు ... విరిగిపోయినవి, నేను బుట్టంధుఁడనను మాటలను వ్రాసి మెడకుఁదగిలించుకొని యుండవలసినదే కాని దారినిబోవు ప్రతివారి నడిగికొని బలవంతపెట్టికాని పీడించికాని వేధించికొని వెంటఁబడికొని యాచించఁగూడదు. ఇట్లక్కడక్కడ నిలుపఁబడి యాచించువారుగూడ నరుదు. గొప్పగొప్పపట్టణములలో సుమారు పదిపండ్రెండుగురికంటె నెక్కువయుండరు. అట్లనుటచే నాదేశమునందు ధర్మము శూన్యమని చెప్పుటకు వీలులేదు. అచ్చటిధర్మమునకును మనదేశపు ధర్మమునకును భేద మేమన నాదేశమునఁ బ్రభుత్వమువారు భాగ్యవంతులయొద్దనుంచి పన్ను వసూలుచేసి బీదలకు దానముచేయుచుందురు ... స్వమతగురువులు తమ యాదాయమునుంచియుఁ దమ మండలములోని భాగ్యవంతుల వద్దనుంచి ... వసూలుచేయు చందాలనుంచియు ... బీదలకు దానముచేయున ట్లేర్పాటుచేయఁబడును. కాని యాపద్ధతిచే దుర్బలులును దౌర్బలులును యాచనావృత్తి నవలంబింపసాగిరి. పిమ్మటఁ బ్రభుత్వమువారే ... బీదలకొఱకు శాసనమని యొక చట్టము చేసిరి. ఈచట్టమువలనఁ గ్రొత్తపన్నొకటి విధించి యాపన్నుచే ... బీదలకుఁ బనులను దానమునకు మాఱు కూలిని గల్పించి వికలాంగులగు బీదలకు దానముచేయ మొదలుపెట్టిరి. ఈపద్ధతియే యిప్పటికిని గొంచెము మార్పుదలతో నవలంబింపఁబడుచున్నది. ప్రతిపట్టణమునందును బీదలకు దానముచేయుటకొఱకు నిర్మింపఁబడిన గృహములు కలవు. ఆగృహములయందే బీదలు దానము గ్రహింపవలయును. ఇతర (స్థలముల) యాచనచేయఁగూడదు. ఇఁక బలముతోనుండు బీదలకుఁ గొన్నిపనులు కల్పింపఁబడుచున్నవి. కాని యవి యింకను దృప్తికరముగా లేవు. పనిదొరకని బీదలను బోషించువిషయమై గవర్నమెంటువారింకను యోజించుచునే యున్నారు. ఈవిధమగు ధర్మమునకును హిందూదేశపు ధర్మమునకును భేదము చెప్పకయే తెల్లమగుచున్నది. హిందూదేశమునందు యాచకులలో నగ్రగణ్యులు కులమునందువలెనే బ్రాహ్మణులు. అట్టిబ్రాహ్మణుల ... చే ... దేశమునకుఁ గొఱఁతయగుచున్నది. ఈదేశమునఁ గాళ్ళుచేతులున్నవారు తప్పక పాటుపడవలయు

వను నిర్బంధ ముండుటచే ననేకకృషు లభివృద్ధిచెందుచున్నవి. ప్రతివారు నేదియో యొక కృషిచేసికొని జీవించవలయును గనుక సోమరిపోతులై యొకరిసంపాదన కాశించియుండుట తటస్థించదు. ఇది...శ్రేయోదాయకము...ప్రతివారు...ఒకరికి లొంగియుండి తమ వ్యక్తిని మఱుఁగుపఱుచుకొనరు. ఇంకొక సంగతిచూడుఁడు. హిందూదేశమునందు జంగమువారున్నారు. వారు బిచ్చమెత్తుకొని జీవింతురు. నీవు దృఢకాయుఁడవు, పాటుపడి జీవించరాదాయని యడిగిన "నన్ను భగవంతుఁ డిట్లు సృష్టించినాఁడు, బిచ్చమెత్తుకొని జీవించుమని నానొసట మూడుపంక్తుల వ్రాసినాఁడు" అని జవాబిచ్చును. అందువలన వతనికి స్వశక్తివిశ్వాసము లేదని స్పష్టపడుచున్నది. అంతియేకాక దేశమునకు మహాకష్టదాయకముగఁగూడ నున్నది. పాశ్చాత్య దేశములయందుఁ బ్రతిష్ఠాపనములకు దానముచేయుటయే రెండవమార్గము ... అనేక ప్రతిష్ఠాపనములు గలవు. అందు ముఖ్యమైనవి విద్యార్థివేతనములు. స్కాట్లాండుదేశ మింగ్లాండుకంటె బీదదేశము. అయినను నచ్చటఁ గళాశాలలలోఁ జదువు విద్యార్థులుమాత్రము తక్కువగ లేరు... ధనికులందఱును బీదవారి కన్నముపెట్టుటయందే ధనమును వినియోగపఱుపక యట్టివారి కన్నముకల్పించుమార్గములయందు వినియోగించుదురు. బీదల కన్నముపెట్టి...బీదతనము పోఁగొట్టఁజాలము. ఆఁకలినిమాత్రము పోఁగొట్టఁగలము. అట్టిబీదలకు విద్యచెప్పించిన వారి బీదతనమునే పోఁగొట్టుటకాక వారి కుటుంబపు బీదతనమును బోఁగొట్టినట్లగును.

---

## మళయాళ బ్రాహ్మణులు

...మళయాళ దేశపు బ్రాహ్మణులలో నంబూద్రిలనియు ఎంబ్రాందిలనియు నిరుతెగలవారు గలరు. వీరియాచారమున కితరబ్రాహ్మణుల యాచారమునకుఁ జాల భేదము. వీరు దినమునకు రెండుమాఱులు స్నానము తప్పక చేయుదురు. ఇదిగాక బయటవెళ్లివచ్చిన వెంటనే స్నానముచేయక యిల్లుచొరరు. అందఱవలెఁగాక వీరు ముందటిజుట్టుంచుకొందురు...వీరిలో సాధారణముగా నందఱును వేదాధ్యయనపరులు...మంచి సంస్కృతపండితులును మంత్రవేత్తలును గలరు. మళయాళదేశమందు వీరికుండు గౌరవము మఱియేయితరబ్రాహ్మణులకును లేదు. వేదాధ్యయనమును యోగాభ్యాసమును జేయుటకు వీరికీదేశమందుఁ గొన్ని ప్రదేశములలోఁ బాఠశాలలవంటివి కలవు. కుటుంబములో జ్యేష్ఠపుత్రునికి మాత్రమే వివాహమాడ హక్కు కలదు. తక్కినవారు మరణపర్యంతము భీష్మునివలె నుండవలసినదే. లేక నాయరులనియుండు నీదేశపు శూద్రజాతికన్యల నుంచుకొనవచ్చును. ఈకన్యలకును బ్రాహ్మణులుంచుకొనుటలోఁ బ్రత్యేకగౌరవము కలదు. (ఉంచుకొన్న) బ్రాహ్మణుఁడు భుజించి విడిచిన యాకున నీకన్నియ యారగించును...

ఎవరో కొందఱు చాల వైదికులమనుకొనువారు తప్పఁ దక్కినవా రందఱు నుప్పుడు బియ్యపు టన్నమే భుజింతురు. ఈదేశపు టితరులవలె వీరు పచ్చిబియ్యపుటన్నము విశేష మొల్లరు. పులుసుఁజేసికొనుటకుఁ దప్ప వేఱే మజ్జిగ వీరి కక్కఱలేదు. ఈమజ్జిగపులుసు నోశనను...ఒకవిధమైనకూరయు నుండిన వీరికిఁ బండుగఁట. మృతి నొందినవారిని దమ దొడ్డియందే దహింతురు. ...ముం దాశవమును దుంటలుచేసి దహించవలెనను భావనతోఁ గత్తితోఁ బ్రతికీలును దాఁకిం...తురు. తండ్రికిముందు తల్లిపోయిన నామెకుఁ గర్మము చేయరు. తండ్రియును బోయినవెనుక నిద్దఱికిని (ముందు తండ్రికిని దర్వాతఁ దల్లికిని) చేతురు. ఈలాటి వ్యతిరేకమైన యాచారములు వీరి కుండుట శంకరాచార్యుల శాపమఁట...పైనఁ (గనఁబఱచినటువంటియుఁ గనఁ బఱుపఁ)బోవునటువంటియు వారి యాచారములలో నేమాత్ర మెవరైనను లోపము గావించినయెడల వారి నొకవిధమైన యోగ్యతోఁ జూచుటయే కాక...వెలి... పెట్టుదురు. ఇఁక వారి యాఁడువారి స్థితియన్ననో చెప్పఁదరముగాదు. ఒకకుటుంబము నందు జ్యేష్ఠుని కొక్కనికే వివాహము చేసికొనుటకు హక్కగనుక నెందఱో కన్యలు భర్తలులేక యవివాహితలుగా నుండుచున్నారు. వీరిలో గోషాపద్ధతియుఁ గలదు. అదియు బహుకఠినము. భర్తతప్పఁ దక్కినవా రెవరును(భర్తతమ్ములుకూడ) స్త్రీని జూడఁగూడదు.

వీరు బయట...మొగలియాకుతోఁ జేసిన యొకవిధమైన గొడుగుతో ముఖము నకు మ...ఱుఁగేలుపఱచుకొని నడతురు. గుంటలో స్నానముచేయునప్పు డితరులు చూడకుండుటకై గోడలతోను దడికలతోను గొన్నిప్రదేశము లాగుంటలయందు సిద్ధముచేయఁబడియున్నవి. ఇఁక విద్యయన్నఁ బూజ్యము...మరణపర్యంతము వివాహములేక యుండవలసినకన్యలలో నెవరైనను గ్రహచారము చాలక మన్మథావస్థకు లోఁబడి సహజముగా జారిణులు కావలసియుందురు. అది యెంతరహస్యముగా జరుగుచున్నను నొకనాఁడు బైటఁబడవలసివచ్చును, అప్పుడు వారిగతి దేవునికే యెఱుక. ఊరివారందఱును జేరి కాలవిచారణము నెడు నొకసభఁగూర్చి యటువంటి యాపెను రావించి యాపె జారత్వముచేసిన విధమును జారుని పేరును నె ...చ్చుట ...ఏలాగు...ఎప్పటినుండి యెంతసేపు జరుగునదియు నాపెచేత నిర్బంధపఱచి చెప్పింతురు. పిదప నాపెను...వెలిపెట్టుటయే కాక (ఊరినుండి) కూడ వెడలఁ గొట్టుదురు. ఒకొకప్పు డీసభ వారమునకు జరుగునఁట. ఆదినములలో నపరాధి కొంటిపూటకూడే. రాత్రి యందఱు భోజనానంతరము గుమిగూడి యత్యుత్సాహముతో నీసభ జరిగింతురఁట. అపరాధి తన సమాచారమంతయు ... చెప్పునప్పు డందఱును వినుచుఁ బ్రత్యేకోత్సాహ మనుభవింతురఁట. ఈయాచార మెంతకష్టమో చదువరులే యూహింతురుగాక. ... (ఆంధ్ర)

---

తే. గీ. కలిగిన దినంబులందు సత్కార్యములకుఁ
గడఁగి ధర్మాత్ముఁడనెడు పొగడ్తఁగాంచి
కొలఁదిదినములు బ్రతికినఁ గొప్పతనమె
వాయసం బుండదే పెక్కువత్సరములు ? 27

తే. గీ. సజ్జనస్నేహ మఖిలార్థసాధనంబు
గర్వరాహిత్య మెప్పుడు సుఖప్రదంబు
ఆశవీడుట జగతి ముదావహంబు
జ్ఞానమార్గంబె ముక్తికిఁ గారణంబు. 28

తే. గీ. సతికిఁ బతిసేవ యిహపరసాధనంబు
భర్తకును సతి స్వర్గసోపాన మరయఁ
గాన దంపతు లిరువురుఁ గలసిమెలసి
కాఁపురముసేయ వారికిఁ గలదె లోటు ? 29

తే. గీ. ఎపుడుఁ గేల్మోడ్తు శ్రీహరి కేను భక్తి
నందసుతునకు మునిగణవందితునకు
ఆర్తజనపాలునకు హాసితాననునకుఁ
బాపభంజనునకు భక్తవత్సలునకు. 30

తే. గీ. అఖిలరోగార్తి కెన్న దివ్యౌషధంబు
నఘవినాశనమునకు సిద్ధాంజనంబు
దుఃఖజలధిని దాఁటించు దొడ్డనావ
రామమంత్రంబె జనులకు రక్షకంబు. 31

తే. గీ. అగ్నిసాక్షిగఁ దాఁ బెండ్లియైనసతిని
ప్రతిపదంబున దోసఁగు కల్పనమొనర్చి
పరిభవమొనర్చి కడగండ్లపాలుసేయు
జనుఁడు వెతనొందఁడే ప్రతిజన్మమందు. 32

తే. గీ. అరుల నిర్జించి భూమండలాధిపత్య
మును గ్రహింప నరేంద్రులు పూను టొప్పుఁ
గాక యాశ్రితులను గడగండ్లఁబెట్ట
యశము లభియించు నెట్లు దుర్యశముగాక. 33

తే. గీ. ఒరులు పరిహాసించినను జూపోపకున్న
దాంభికుఁడుగాక వర్తించు ధర్మమూర్తి
కేమిటను లేవు లోపంబు లెంచిచూడ
వినయమే భూషణముగాదె జనున కెపుడు ! 34

తే. గీ. బ్రతికినన్నాళ్లు ఋణముల పాలుగాక
పరుల నాసింపఁబోక శ్రీహరిపదాబ్జ
చింతనామృతపానంబు సేయువాఁడు
ధన్యుఁడై కీర్తిగాంచి సద్గతుల నొందు. 35

తే. గీ. పరసతులఁ దల్లుల నెంచి పఱలపలయుఁ
ప్రజల బిడ్డలఁబోలెఁ గాపాడవలయు
బుధుల దర్శించినపుడు గేల్మోడ్పవలయు
సకలసౌఖ్యంబు లిందె భూజనుల కబ్బు. 36

తే. గీ. సిరియు సంపద సద్భాగ్య స్థిరయశంబు
గూర్చి సురలోకమునకుఁ దాఁ జేర్చు నెద్ది
యదియె సత్యంబు, దాని కెందైన సాటి
గలుగువస్తువు లేదు జగంబునందు. 37

తే. గీ. సంతతపరోపకారసుస్వాంతుఁ డెపుడు
ప్రజకు న్యాయంబె చేయు నెప్పట్టునందు
కరము బాధింపఁబడుచును నరుల కెపుడు
చల్లనగు నీడ నిచ్చు వృక్షములభంగి. 38

తే. గీ. తమకుఁగలిగిన మచ్చ నెదం దలంచి
పరుల కటు చేయఁదలఁతురు పాపు లెపుడు
తోఁక తెగిన సృగాలము దుష్టమతిని
దక్కునక్కలఁ జెఱపఁగాఁ దలఁచుభంగి. 39

తే. గీ. శత్రువుల సంహరింపంగఁ జాలుమంత్రి
మాంగమంబుల సార మైనట్టిమంత్రి
మజ్ఞతను బాఱఁదోలెడునట్టి కృష్ణ
మంత్రము జపింపు మనస ! నీమనసుదీర. 40

లందును గోరుదు రల్పసౌఖ్యములకు
నన్యోన్యవైరంబు లంది దుఃఖ
ములఁబొందుదురు, గాన మునుకొని గురుఁడైన
వాఁడు మాయామోహవశుఁడు నెంత
జడుఁడు నైనట్టి యాజంతువునందును
దయగల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ
గన్ను లున్నవాఁడు గాననివానికిఁ
దెరువుఁజూపినట్లు తెలియఁబలికి
అతులమగుచు దివ్యమైన యామోక్షమా
ర్గంబుఁ జూపవలయు రమణతోడ. ౪౬

సీ. భూతజాలములందు భూజముల్ వర్యముల్
భూరుహములకంటె భోగికులము
భోగిసంతతికన్న బోధనిష్ఠులు, బోధ
మాన్యులకన్నను మనుజవరులు
వీరికన్నను సిద్ధవిబుధగంధర్వులు
వారికన్నను సురల్, వారికన్న
నింద్రాదిదేవత లిందఱికన్నను
దక్షాదిసన్మునుల్ దలఁప నెక్కు
డంతకన్నను భర్గుఁ డా యభవుకన్నఁ
గమలభవుఁ డెక్కు డాతనికంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల నాదరించుఁ
గాన విప్రుండు దైవంబు మానవులకు. ౪౭

కం. చిరకాలతపమునైనను
హరియింపఁగనోపుఁ జిత్త మని పెద్దలు న
మ్మరు జారులకుం జారిణి
కరణిని నడరించు మనసు కామాదులకున్. ౪౮

కం. శరణని వచ్చినజంతువుఁ
గరుణం గనువిచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికంబని మున్
కర మెఱిఁగించిరి మునీంద్రగణములు ప్రేమన్. ౪౯

కం. ధరలోన నెవ్వరేన్నియు
ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచినవా
రరయఁగఁ జెడుదురు నిక్కము
హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేఁ. ౧౦

కం. అరయఁగ సంసారాటవిఁ
దరలక యాపుత్రమిత్రదారాదు లనఁ
బరఁగుచునుండెడు వృకములు
పరువడి నరబ స్తములను భక్షించు వడిఁ. ౧౧

ఆ. మఱచి కాననమునఁ గోఱవిదయ్యముఁగాంచి
యగ్నిఁగోరి వెంట నరుగుమాడ్కిఁ
గాంచనంబుఁగోరి కలవారియిండ్లపం
చలను దిరుగు నరుఁడు చలనమంది. ౧౨

ఆ. అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృష్టిఁ
బొంద కోరులధనముఁ బొందఁగోరి
యరిగి వారివలన నవమానములఁబొంది
యధికమైనదుఃఖ మనుభవించు. ౧౩

ఉ. భారతవర్షజంతువుల భాగ్యము లేమనిచెప్పవచ్చు నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిఁ
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మిసేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁజేయుచునుండు నెంతయుఁ.

కం. పరపుత్రకళత్రంబులఁ
బరికింపక యుపహసించుపాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁడై యమ
పురుషులచే నధికబాధఁబొందుచునుండుఁ. ౧౫

కం. పరకాంత నెవ్వఁడేనిం
బురుషుం డుండంగ మొఱఁగి పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద
ప్తజమునఁ బడవైతు రంధతామిస్రమునఁ. ౧౬

ఆ. సర్వజంతుజాలసంగము మొందెడు
వానిఁ బట్టి కట్టి వజ్రదంష్ట్ర
కములు గలుగునట్టి ఘనతరశాల్మలీ
తరువులందుఁ జేర్చి దంతు రెపుడు. ౫౭

కం. శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేఁటలాడి యాత్మార్థము,,
వనమృగములఁ జంపును నా
మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్. ౫౮

ఆ. జృంభణమున నెవఁడు దంభార్థమై పశు
వులను జంపి జన్నములను జేయు
వానిఁబట్టి యమునివారలు గోయుచు
నుందు రెపుడు మిగుల సందడిలుచు. ౫౯

సీ. లంచంబుఁగొని సాక్షి వంచించి యనృతంబు
పలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత మానక వీచి యమునరకమునందు
శతయోజనోన్నత శైలశిఖర
మునఁ దలక్రిందుగా నునిచి యధోముఖం
బుగఁబడద్రొబ్బిన బొబ్బలిడుచుఁ
గల్లోలములులేని కమలాకరముఁబోలెఁ
జదరమైయున్న పాషాణమందుఁ
బడినయంతన దేహంబు పగిలి పెక్కు
తునకలై పాసి యది గూడికొనుచునుండ
దండియాకులతను బొందుచుండుఁగాని
చావులేకుండు నాదుష్టజంతువునకు. ౬౦

కం. తనయింటికి వచ్చిన మను
జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచినవానిం
గనుఁగవలవజ్రదంష్ట్రలఁ
దనరినయాకంకగృధ్రతతి భక్షించున్. ౬౧

మ. ధనవంతుండగుమానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయకయుండెనేని యమలోకంబందు సూచీముఖం
బను నా దుర్గతిఁ బట్టిఁ ద్రోఁచి యిది గాఁపైయున్న భూతం బట
న్చును పాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై. ౬౨

కం. కాలం బెడగని పాపము
మూలముఁ జెఱుపంగవలయు మును రోగములం
దేలిన దోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు వైద్యునిభంగిన్. ౬౩

కం. హితవుగల కుడుపు మఱి రు
గ్వ్రతతులఁ బొడమంగనీని విధమున నతిన
ద్వ్రతుఁడైనవాఁడు నిర్మల
మతిచే నఘరాశినెల్ల మట్టము సేయున్. ౬౪

చం. తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమసద్దమంబులన్
జపమున సత్యశౌచముల సన్నియమాది యమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తనువాక్యజంపుఁ బా
పపుగుది ద్రుంతు రగ్ని శతపర్వవనంబుల నేర్చుకైవడిన్. ౬౫

ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమారపదారవిందజా
నందమరందపానకలనారతషట్పదచిత్తులౌచు గో
విందపరాయణుల్ విమలవేషులు దోష మడంతు రాత్మలం
జెందినభక్తిచేత రవి చేకొని మంచు నడంచుకైవడిన్. ౬౬

కం. హరిభక్తిచేతఁ గొందఱు
పరిమార్తురు మొదలుముట్ట పాపంబుల ని
ష్ఠురతరకరముల సూర్యుం
డరుదుగఁ బెనుమంచుబింక మడఁచినభంగిన్. ౬౭

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగఁజేయు
వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచనభక్తవరుల సేవించిన
వాని కైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠనిర్మల వ్రతపరుండైనట్టి
వాని కైవల్య మెవ్వనికి లేదు.

సీ॥ ఒకదినంబును సూర్యు నుదయమందనుక న
స్నాతుఁడై యుండఁడు జడునిభంగి
ఒకదినంబును నాగమోక్త దేవర్షిపి
త్రారాధనము మానఁ డలసుఁడగుచు
ఒకదినంబును స్వేచ్ఛ నూరక జలమేని
త్రావఁడు దేవతార్చనములేక
ఒకదినంబును బంక్తి నొక్క బ్రాహ్మణుఁడేని
లేకుండ భుజియింపఁ డేకతమున
ఒకదినంబును మృష్టాన్న మొసఁగకుండ
వట్టి పచ్చడిమెతుకులు పెట్టఁ డతిథి
కిట్టి లీల నుండినన్నాళ్ళు నెట్టెఁగాల
మనఘుఁడగు లక్ష్మినారాయణార్యుఁ డౌర !

తండ్రిగతించునాఁటి కీయన రమారమి ౨౦ యేండ్ల ప్రాయపువాఁడఁట. ఆతండ్రికిఁ దానే ప్రథమసంతానము. ఒక్కతమ్ముఁడు నిరువురు చెల్లెండ్రు నుండిరి. తల్లి మరల గర్భవతి. ఇందఱిని బోషింపవలసిన భారము వచ్చి నెత్తినిబడినది. జనకుఁడు సంపాదించినది యశోధనమే కాని యితరధనము సున్న. పదిపదునొకం డెకరముల పంటవలంతియు సగము గ్రామపురోహిత్యమునే పిత్ర్యము. ఈస్వల్పవృత్తికి స్వవిద్వత్త తోడుగాఁ గుటుంబమును బోషించుచు మొదటఁ దనపెండ్లియుఁ బదపడి క్రమక్రమముగా నిరువురుచెల్లెండ్రియు నిరువురుతమ్ములయు వివాహములఁ గావించెను. అంత దారిద్ర్యముతో నుండుటచేతనే కాఁబోలు మొట్టమొదటనైన తనపెండ్లిలో వధూవరులకుమాత్రమే వరియన్నముకొని తక్కటి తద్వివాహాగతు లందఱికిని జొన్నన్నమేయఁట ! ఆరోజులస్థితి యది. ఆదియం దంతదారిద్ర్య మనుభవించినను నటుతరువాత నందఱికన్న మిన్నగా నతిథ్యభ్యాగతుల నర్చించుచును సహోదరుల సవరించుచును సమీపస్థములగు కోటనెమలిపురి యంచురాజుపాలెముల యావత్పౌరోహిత్యమును నకరకంటిలో నాలుగెకరముల యినామును నార్జించెను. నకరకల్లే యాయనయత్తవారియూరు. ఆయూరిలోఁగల యవనీసురు లెల్లరు నాయనకు శిష్యులు. ఒక్కయాయూరివారే యననేల ? అనేకగ్రామస్థు లాయనయొద్ద మంత్రోపదేశములఁ బొందుచును నాయా ధర్మ తత్త్వ మంత్ర రహస్యములఁ దెలిసికొనుచును నాకాలమునకుఁ దగినట్టు లర్థ మర్పించుచుండెడివారు.

అట్టివారందఱిలో నా నకరకంటిగ్రామనివాసి తుంగతుర్తి నరసయ్య దొడ్డ బ్రాహ్మణుఁడు. కనుకనే గురువునకు స్థిరమైన జీవనాధార మేర్పఱచి సురలోకమున స్థిరముగా నుండుచున్నవాఁడు. ఉండుఁగాక. మాతండ్రికిఁ దండ్రిచచ్చునాఁటికున్న తమ్ముఁడు వివాహితుఁడై పుత్రులు కలుగకపూర్వమే భువిఁ బాసిపోయెను. తత్పితృ నిర్యాణసమయమునఁ దల్లికడుపులోనుండిన తమ్ముని బెంచి పెద్దఁజేసి పెండ్లి పేరంటములుగావించి పైతృకమునను స్వార్జితమగు పౌరోహిత్యమునను మాతండ్రి భాగముఁ బంచియిచ్చెను. కాని నకరకంటియినాముమాత్రము పంచియిచ్చినవాఁడు కాఁడు. అందుల కయ్యనుజుఁ డభియోగము నడిపియు నకృతార్థుఁడే యయ్యెను. ఇంకను మానాయన స్వకుటుంబపోషణకు స్వదేశార్జన చాలకకాఁబోలుఁ బరదేశములుగూడఁ బర్యటించితినని బాల్యమందున్న నాతోఁ బ్రసంగించుట బాగుగా జ్ఞాపకమున్నది. ఉత్త పర్యటనమే కాదు. పటాలమునకుఁ బౌరోహిత్యము చేయుచుఁ గొంత కాలము మహారాష్ట్రదేశమున మనినవాఁడఁట. పటాలమునకుఁ బ్రయాణము సంభవించి నప్పుడుగూడఁ గూడఁ బోవుచుండెడివాఁడు. పటాలము బాహ్యమున విడిసినప్పుడు బ్రహ్మకర్మము నిర్వర్తించుకొనుటమొదలగు పనులకుఁ బల్లియలలోపలికిఁ బోయివచ్చెడివాఁడు కాఁబోలు. అప్పట్లనొకనాఁడు సాయంసమయంబున దగ్గఱ దండు విడియుటయుఁ దాను గ్రామములోపలికిఁ బోయి సంధ్యావందనము చేయుట కొక బావియొద్దనఁ జేరి దుస్తులుదీసి క్రిందఁబెట్టుటలో నగుపడిన రూపాయలసంచిని హరించునూహతో నాయూరి బ్రాహ్మణు లొక రాతిథ్యమునకుఁ బిలిచి యత్యంతాదరముఁ జూపుచు నన్నాదికము సిద్ధమగుదాఁక నంతర్గృహములో శయనింపుఁడని మంచముపై శయ్యనమర్చి యాయన పరుండిన పదపడి యాంధ్రుఁడగుట నవిదితమహారాష్ట్రభాషుఁడని యనుకొని యాత్మీయభాషతో నన్యోన్యము నాలోచించుచుండ నందలి యర్థ మాయన గ్రహించి ప్రాణభయముచేఁ బర్యంకమునుండి లేచి యాయుధాన్వేషణకార్యమునఁ బరాకుతోనున్న యింటివారి గనుమొఱఁగి యంధకారబంధురంబును వృష్టిపాతవిశిష్టంబును నగు నారాత్రి మెల్లమెల్లగా విశాలావరణసమవేత తద్గృహబహిర్ద్వారము సమీపించియుఁ దత్కవాటమునకుఁ దాళము వేసియుండుటచే నొకచోట గోడకానుకొనియున్న గొప్పవృక్షము నెక్కి యావల కందుబాటులో నున్న కొమ్మనుండి కుంభినిం బడదూఁకి తెన్నుగానక తిరిగితిరిగి యొక శ్మశానవాటిని సమాశ్రయించియుండుటయు నింతలో నీగోడవ దెలియక యింటియల్లుఁ డెక్కడ నుండియో వచ్చి యీయన పన్నుండి లేచివచ్చిన పర్యంకముపైననే పండుకొని నిద్రించుటయు సర్వసన్నద్ధులై గృహాధిపతులు శయనించియున్న జామాత కంఠమును ఖండించి సంచి వెదకి కానరామి దీపముదెచ్చి చూచి వాపోవుచుఁ దెల్లవాఱినఁ దెలిసి యెవరేమిచేయుదురోయను భీతి నా యర్ధరాత్రియే యల్లునిశవ మాశ్మశాన భూమికే కొనిపోవుటయు నాసందడిచూచి యీయన యెటో పాఱిపోయి నిశాశేష మెక్కడనో వేఁగించి కనువెలుతురగుటతోడనే గ్రక్కునఁజని సేనానాయకునకు నివేదించి హంతకులఁ బట్టించి శిక్షింపించుటయు నప్పుడప్పుడు ప్రసంగవశమున మా

తండ్రి మాతల్లితోఁ జెప్పుచుండెడివాఁడు. ఇంతటిచిత్రగాథ నమ్మనేరక పదిపండ్రెండేండ్ల ప్రాయమందున్న నేను ప్రశ్నించి పరిశీలించి యద్భుతపడుచుండెడివాఁడను. కనుక నే మాజనకుఁడు మహారాష్ట్రభాష మాటలాడెడివాఁడు. మహారాష్ట్రమే కాదు. హిందీ, అరవము కన్నడముగూడ నాయనకు విదితములు. దండులోనుండుటయే కాక తత్తీర్థక్షేత్రములు సేవించుటకై యనేకదేశముల కరిగియుండెను. కాలినడకను గాశికేగెను. అచ్చట గంగం దరించుతటి సామా నధికముగా నున్నదని నావికుఁడు తగవుపెట్టుకొని దిగుదిగుమని యదలింపఁగా నడిప్రవాహమునఁ బడదూఁకి యీఁదఁ గడంగెనఁట. అంత నాతఁడు భయపడి బ్రతిమిలాడి మరలఁ బడవపై నెక్కించుకొని దాఁటువేసి కూలి యేమియుఁ దీసికొనకయే దింపి పంపెనఁట. ఈఁతగాఁడని తెలిసి యింగ్లీషువా రిరువు రీవల నావల నావలపైఁ దా ముండి యీయనచే నీఁదించి యెంతయు బహుమానించిరఁట. కావునఁ జదువుసంధ్యలలోనే కాక చాలవిషయములలోఁగూడ నీయన చతురుఁడని తెలియనయ్యెడిని. ఈయన మూర్తిగూడ నాజానుబాహువు. మిగులఁ బొడవరి. దృఢకాయుఁడు. మంచి భోక్త. తాను దిన్నను నొకరికిఁ బెట్టినను భోజనము సూపాజ్యభూయిష్ఠమై యుండవలె. ఒక్కచో మాయూరి కరణము తమ్మునికి మనువువిచారించుటకుఁ గాఁబోలు, నినిమెట్లకో యేయూరికో యేగుచు స్వాచార్యుఁడును జ్యోతిషికుఁడును బెద్దమానిసియునైన యీయననుగూడఁ గూడనుంచుకొనుటయు నినిమెట్లసమీపమునఁగల కొండను వాఁగును జూచి "చెన్నకృష్ణయ్యా! ఈకొండంతపప్పును నీనీటిప్రవాహమంత నేయియు నైన నాకుఁదృప్తి యగుఁజుమీ"యని యందఱిని నవ్వించెనని యాచెన్నకృష్ణయ్యమొదలైన యప్పుడున్నవారు విన్నవారు నప్పుడప్పుడు చెప్పుచు నాయన యాహారప్రియత నగ్గించుచుండెడివారు. డెబ్బదియేండ్లు బ్రదికెనుగాని పల్లుతీఁ వెఱుఁగఁడు. అనుదినము నన్నము భుజించుటతోడనే పిడికెఁడు కటికిజొన్నలు పక్కలోఁ బోసికొని పైత్యహారమని పటపట నమలి తినుచుఁ బడుకొనెడివాఁడు. ఆయనకాలములో నందును బలనాటిలోఁ బండుగయో పర్వమోవచ్చినఁ దప్పఁ బెరసమయములలో వరియన్నమునకు మొగమువాయవలసినదే. ఆపండుగుపర్వములలో నైనను బ్రాహ్మణులకే యది ప్రాప్యము. అంతదుర్లభమైన శాల్యన్నమే యన్వహము నస్మజ్జనకుని యాహారము. అయ్యది యాయన కొక్కనికే కాని యాయన కుటుంబమున కంతకు మరల దుర్లభమే. కడగొట్టు కొడుకను బాలుఁడను నైన నాకుమాత్ర మాయనపొత్తుననో పంక్తినో శాల్యన్నము దొరకుచుండెడిది. ఆయన గ్రామాంతరమునకుఁ బోయినపుడు నాకైనను నాలుగైదేండ్ల లోపలిసంగతి తెలియదుకాని యటుపైని యావనాళా ద్యన్నప్రాశనము తప్పునది కాదు.

అందువలన నాయన గ్రామాంతరమున కరిగినప్పుడు తిరిగి యెప్పుడువచ్చునా యని యెదురుచూచుచుండెడివాఁడను. ఈ కదన్నభక్షణము ప్రాచీనకాలమునుండి పలనాటఁ బాదుకొనియున్నయది. అందులకుఁ బలనాటినిగూర్చిన కవిసార్వభౌముఁ

డగు శ్రీనాథుని "కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచుఁ" అను పద్యపాదమే సాక్ష్యము. కోటనెమలిపురి యంచు రాజాసాలెములు జానపాటికి షుమారు నాలుగైదు మైళ్ళ దూరమందుండునవి. అచ్చటిజనులలో శర్లదే పెక్కండ్రు. వారందఱుఁ బూజ్యుఁడగు మాతండ్రిని పురోహితునిగా వరించి యాయనపట్ల భక్తిశ్రద్ధలతోఁ బ్రవర్తించుచుండెడివారు. తత్కుటుంబజీవనమునకుఁ దగునట్లు ద్రవ్యమర్పించుచుండెడివారు. పౌరోహిత్యము పాడిబఱ్ఱెవంటిదను లోకోక్తి యప్పట్లనాయనయెడల నన్వర్థకమగుచు వచ్చెను. అట్లు తానును దనతమ్ముఁడును జాలవఱకుఁ దద్గ్రామపౌరోహిత్యముతోడనే తమకుటుంబములఁ బోషించియుండిరి. ఆరెండూళ్ళలోను మాతండ్రిపినతండ్రులకుఁ బెద్దబ్రాహ్మణుఁడు చిన్నబ్రాహ్మణుఁడనియే సంజ్ఞ. కోటనెమలిపురి మంచి పంటగల గ్రామము. కాయగూరలు సమృద్ధము. అయ్యవి బుద్ధిపూర్వకముగానే పురోధల కర్ప్యమాణములు. బుడమకాయదగ్గరనుంచి పొరుగూళ్ళకుఁ దీసికొనిపోయి యమ్ముకొనుదిన మిపుడువచ్చినది కాని యపు డెవరియింటి కేగికాని యేతోఁటలోఁ బ్రవేశించికాని కావలసినన్ని కాయగూరలు మాతండ్రులు కోసి తెచ్చుకొనెడివారు. ఎట్టిలోభియైనను నిదియేమి యనెడివాఁడు కాఁడు. వారికే యన నేల? వారిపుత్రులమైన మాకును నభ్యంతరము లేకయుండెడిది. నాబాల్యమున నేను నాతండ్రితోనో వేఱుగనో యాయూరి కరిగిన నాబాలవృద్ధము పెద్దబ్రాహ్మణుని కొడుకని యెంతయుఁ బ్రీతిచూపుచుండెడివారు. ఇతరవిషయముల నెంతపూజ్యుఁడైనను నీగ్రామపౌరోహిత్యము మాత్రము మత్పితృపాదుల కొక్క కళంకము కాకపోలేదు. బలిసియున్న యగ్రహారికులు పండితులు లోనగువారి యాక్షేపములకుఁ బాత్రుఁడు కాక తప్పినదికాదు. ఈకళంకము వేఱువిషయముల నాయనను బాధింపకున్నను బుత్రపుత్రికా వివాహవిషయమున మాత్రము కొంత బాధించినది. ఈయనకు నలుగురు కొమరులును ముగ్గురుకొమరితలును గలిగియుండిరి. అందుఁ బ్రథమద్వితీయపుత్రికలకు మేనరికములే యుండుటచే వెదకికొను నవసరము లేకుండ వారికే యిచ్చి వైవాహిక మాచరించెను. ప్రథమకుమారునకు మేనమామకొమార్తె నిచ్చిరి. ఇఁకఁ దృతీయకుమారికిని దక్కినకొమాళ్ళకును సంబంధములు కావలసివచ్చెను. ఆకొడుకులకంటె నవివాహితయైన మూడవకూఁతురే పెద్దది. అందువలన నామెవివాహమే యావశ్యక కార్యమగుటయు నన్యత్రియేలయరుగవలెనని స్వగ్రామస్థుఁడేయగుపప్పూ సుదర్శనశాస్త్రిల కిచ్చుటకుఁ బ్రయత్నించిరి. కాని పురోహితులపిల్ల నొల్లమని వారు తిరస్కరించిరి. ఆయనతల్లి పురోహితులైన మా జానపాటివారి యాఁడుబిడ్డయే యైనను నప్పటి పాండితీగర్వము వారిచేత నట్లు చేయించెను.